స్వేదరూపమున మాజీవరక్తంబు
ప్రతిదినం బెడలేక ప్రవహించుచుండె
సంతోషపర్యవసాయియై వెలయు
ఫలము మా కేనాఁడు ప్రాప్తించు నొక్కొ
ఎనలేని దారిద్ర్యమే మమ్ముఁ జుట్టి
పాఱఁదోలఁగ సాధ్యపడదయ్యె సకట.

* * *

తెరపి సుంతయు లేక దేవ! మా తలను
కురియుచున్నదికదా కుంభవర్షంబు
అర్గలంబగుసీతు వస్థిలోకమును
కర్కశమ్మొనర్చి కారించుచుండె
ఇస్సిరో నరజన్మ మెత్తియు మేము
పశుధర్మమును బూని బ్రదుకంగవలసె
కటకటా! మాపాట్ల కాలుచుండినను
నిశ్చలంబయ్యె మానీచజీవితము.

* * *

భువి సేద్యగాండ్రమై పుట్టుటం జేసి
హాహారవంబె మా కాహారమయ్యె
ఘోరమౌ మరణంబు కొఱకె మే మిటకు
వచ్చుచున్నారమా? వనటలేనట్టి
దిన మొకండేని సిద్ధింపదో? మాకు.

* * *

విద్యకై మేమును విద్య మాకొఱకు
చింతించుచుండ మాజీవితంబెల్ల
దున్నుట దోఁకుట తోడనే గడచె
మాకు విజ్ఞాన మేమాత్రంబు లేమి
నలరసాయన శాస్త్ర మటు నిద్రవోయె
ఎట్టిటో లభియించు నేకబీజంబె
మా కనర్ఘంబైన మౌక్తికంబయ్యె.

* * *

ఇతరదేశంబుల కృషికులవోలె
నిన్నటిసారంబు నేఁడు మా కేది?

ఎవ్వరిమాయయో ఎవరిమంత్రంబొ
ఎవ్వరికపటంబొ యిటు సేయుచుండె
మాబలం బడుగంట మాభూమియెల్ల
నిస్సారమై కడు నిష్ఫలంబయ్యె.

* * *

రంగదుత్తుంగ తరంగ సంగతిని
చెంగటం బ్రవహించు జీవస్రవంతి
అట్లయ్యు మాపొలం బల్లాడుచుండె
బిట్టెండ తాఁకున బీటలు వాఱి.

* * *

అపరాధుల విధాన నందఱు వలన
భీతిల్లుచున్నాము పిఱికి తనాన
దేవ! మే మొక్కొక్క దివసంబు నెట్లు
దాఁటుచున్నారమో తరమె చెప్పంగ.

* * *

రక్తమంతయు నయో రాత్రిందివంబు
స్వేదరూపంబున క్షీణింపఁ దొడఁగె
పాడిపంటలసొత్తు వడ్డీలవలన
మాచేతులంబాసి మాయమై పోయె
అన్నంబు మా కిట నార్తనాదంబె
కడకు పానీయంబు కన్నీరొకండె
కడగానరాని యీకష్టంపు బ్రదుకు
మా కింక వలదయ్య మా కింక వలదు.

* * *

వ్యాకులమైన మావాణి నీతోడ
వెఱ్ఱిచే నిటు విన్నవించెడిం గాని
ఎఱుఁగవే నీవు మా యెల్ల దుర్దశల
ఈదీనులయవస్థ నెల్ల వీక్షించి
కృపఁజూపుమో దేవ! వృష్టిరూపమున.

* * *

చదువరీ! నీ వింక సద్భావ మూని
రైతుసోదరుల దుర్దశలెల్లఁ దొలఁగ
మేలుకొల్పుము వారి మేల్కొల్పనయ్య
తరుణం బిదే నీకు తగుసేవ సల్ప
ఆలసించిన లాభ మావంత లేదు
ఏదేశమందు రైతేడ్చుచున్నాడొ
ఆదేశమునకు రాదయ్య మోక్షంబు.

---

## పౌషి

సహదేవ సూర్యప్రకాశరావుగారు

మిసిమివెన్నెల, తొలుకారు పసిడివన్నె
మొగలిపూలకన్నెల నరమోడ్పునిదుర
కలువరింతల చివురొత్తు వలపురేక
లేతనునుమబ్బు రేకలో లీన మాయె.

మధురమేమొ, ఆశారాగ మధురమేమొ
నీహసించు వెన్నెల హిమానించి, పడుచు
కన్నెలరసందె పెదవి నిగారమందు
విరిసి వాసించిపోయె, జీవించిపోయె.

కలలె తారలై, వెన్నెలై, చలితలలిత
రాగమూర్తులై, వినువీథి మ్రోగిపోవు
లేక ఈనాడు ఏనాడు లేని యింత
మధురిమోన్మత్త లంస్యసీమంత మేమి?

ఓయి తారామనోహరా! యుష్మదీయ
హాసరాగాను రాగ వీక్షాంచలములు
నాకుటీజాలపదసీమ సోక, సుప్త
తప్తహృదయమ్ము తుళ్లి నిద్రాణమాయె.

అపుడు సాంత్వన మిత్రములైన నీసు-
ధాకరమ్ము చాచెద వీవు నాకరమ్ము
కొరకు, అరచాటు సిగ్గు దొంతరల నిమిడి
కూర్చుకొనుచుండ ప్రేమావకుంఠనమ్ము.

నానిశాలోకనావేదనానుభూతి
బూచి, చరిత్రభ్రుకుటిలతాక్షోభ చూచి
మూతివారినకను లట్టె పులకరించి
విచ్చుకొనిపోవ చుంబించి వేసినావు.

పతితనిర్జీవ జీవితస్మృతుల, వెలుగు
చీకటుల కౌగిలింతల చిటులు, కుటిల
నీలినీలాలకాలిక నృత్యకేళి
స్వప్నవీథిక నలసాలసమ్ములాయె.

మనల దేనాటి బంధమ్మొ మలసిపోని
సొగసిపోని ఆశాకాశ శుభ్రవీథి
నిదుర దేలిన హ్రాదిని గదించివైతు
వంతమేలేని కాల మున్నంత వరకు.

అంత నే సోలిపోదు నీ నంత నిత్య
యాత్ర సాగించుకొనుచు వియత్తలాన
పరిమళాహ్వాన తోరణపంక్తు లల్లు
చెచ్చెరెచ్చటికో ప్రయాణించి పోదు.

---



శ్రీ పి. సత్యనారాయణగారు



శ్రీ కారుమూరి సర్వేశలింగంగారు.



శ్రీ కనగపాటి పూర్ణయ్యగారు



శ్రీరామకృష్ణ సేవాశ్రమము, ఇచ్ఛాపురము.